అనుచు రజకుని వీపుపై యాచముంతు
తట్టి రాజాధిరాజ పాదముల కేని
వంపని శిరస్సు వంచి యా పైఁడికాన్క
స్వీకరింపఁగ గన్గొనెఁ జాకివాని.

ఏడు సముద్రముల్ కలఁగి యేకముగాఁ బ్రవహించుచున్నవో
యేడును దంత్రు లొక్కమొగి నేడుపు యూఘ్రుస నేస్పుచున్నవో
యేడనో లోతులోనఁ గనిపించెడి చిక్కని గుంటకన్ను లం
దోడికఁ గట్ట నశ్రువులు హోరున నేడ్చుచుఁ జాక లిట్లనున్.

బాబూ! ఈ వెలగట్టరాని మణులీ బంగారు నాణెమ్ములున్
నాబోటుల్ గ్రహియింపనౌనె? యిటులెన్నండైన భావింతునే!
నాబొందిన్ గలయంతకాల ముసు కీ నాణెమ్ము లే నొల్ల, నీ
మా బాబున్ సరితూచి యిచ్చినవి మన్మాన్యమ్ములై యొప్పినన్.

ఈ మొహరీలవాన సహియింపఁగ లే నొడలెల్ల నిక్క నా
రోమములన్ని పాములయి రోఁజెను బుస్సని, ఈ మణీ ఘృణీ
స్తోమము సోకి నాకనుల చూపణఁగారెడు గోరుగంట ని
షాక్రిమిత కాచబింబములుగాఁ బొనరించి నటుల్ మహాప్రభూ

చెఱుపఁ బోకుఁడు నా యశశ్శ్రీసముచ్ఛ
తచ్ఛటాకాంతు, లెప్పుడో ధరణిఁ జెప్పి
కొనెడి శ్రీరంగరాయుల కొమరు నొక్క
చాకి బ్రదికించి కొనెను లంచమ్మటంచు.

మా బాబున్ గొనితెచ్చి నే నిప్పుడు బ్రహ్మానందసందానిత
మాత్మ బాహుళ్యయి కీ మలీమస సువర్ణాకార కాలుష్య చిం
తాబంధమ్మును గూర్చుకో మనసురా, దాబాలగోపాల మీ
నా బంగారుకతన్ సచిత్రరస మానన్ నాకు హుందాయగున్.

మీమాటన్ జవదాటి నే నెఱుఁగ, బొమ్మియ్యనన్ బోతిన్, గతో
రామఘోగ్ర కరాళ మృత్యుముఖ దంష్ట్రల్ సొచ్చి యెట్లేని గా
నీ మారంగమహేంద్రము ఘుత్రకుని దెమ్మియ్యన్నఁ దోడ్తెచ్చితిన్
స్వామీ! నేఁటికి మీజానాడ, నయిదింపన్ రాదొ నన్నింతటన్.

జగ్గరాయ లెప్పు డగ్గిఁకంటను గాచు
రాణి కాళియట్లు గోణి దిరుగ
నతనికంట నీరు నాకెంటను దుస్సు
గొట్టి విజయశుభము పెట్టినాఁడ.

మణిని బేదవాఁడు మసిపాత గొన్నట్లు
గట్టి దొరలనెల్ల బుట్టఁబెట్టి
మైలబుట్టఁ బెట్టి మా బాబుఁ దెచ్చితి
నంతులేని ముదము నాచుకొంటి.

నా యానందములోఁ బా
లీయఁగఁ జాలన్ రవంత యీ తుచ్ఛశిలా
చ్ఛాయల కాశించియు, క్షణి
కాయుష్యమ్ములైన సిరుల కాసించియునున్.

అని చివాలునఁ గైవ్రాలె యాచమేంద్రు
పదములన్ వాని నిర్మల భావకలిత
చిత్తవృత్తికి లోన నచ్చెరువు పొంది
యాచముఁడు వానిఁ బైకెత్తి యాదరమున.

నీ యానందములోఁ బా
లీయఁగ వలదోయి నీ సమిద్ధయశశ్శ్రీ
మాయింపఁ జూడకుమోయీ
బోయాఁడా! దుఃఖ మింకఁ బోవిడుమోయీ.

పెద్ద విద్దె లెన్ని పేరికిఁ జదివిన
నెన్ని పెద్ద బిరుదు లున్న నెంత
పెద్దజాతి నుద్భవించిన నినుబోలె
మనుజధర్మ మెవఁడు మనిచినాఁడు.

మాకును బూజ్యుఁడ వోయీ
చాకలి వను మాట ధనవిచక్షణభావుల్
నీకున్ గల్పించిరి బ్రా
హ్మీకల్యాణార్థ ధర్మ మిదియే మొదటన్.

అనుచు నతని బరిష్వంగ మాచరించి
యుదు శశి మహార్క మండల ముందు దాఁక
జెఱిగి పోవని గౌరవశ్రీ యొసంగి
యాచమేంద్రుఁడు చాకలి నంపినాఁడు.

అతఁడు చాకలి కాఁడు కాఁడనఁగఁ దగదు
దేశవిద్రోహశిక్షావిదీర్ణశీర్ణ
హృదయతాపాగ్నిదగ్ధశరీరుఁ డగుచు
రజకుఁడైనట్టి తిరుమలరాయఁ డతఁడు.

అతఁడు చెప్పఁడు యాచముఁడడుగఁ డతనిఁ
జాకి యనియెఁ దలంచె నిజాత్మయందు
కాని యెందుకొ వాని యాకారధీర
గురుగభీరోరుగమనమ్ము నరయసాగె.

ఆలోఁ దద్విభుఁ జేరవచ్చి రొడలంతం తల్లకల్లోల ము
ద్వేలమ్మై రుధిరమ్ము జాలునడి బింబింపన్, గపాలాస్థికం
కాలమ్ముల్ ధరియించి వీరరస మాజ్ఞాపూర్తికిన్ వచ్చి న
ట్లోలాఁగందుచుఁ గొంద ఱుగ్రభటు లాయుశ్శేషులై నాఁటికిన్.

వారిని జూచి కెవ్వమనెఁ బౌరజన, మ్మడియాసలన్ వృథా
గూరుచు యాచమప్రభుఁడు కొంకుచుఁ 'దెత్తురె రంగరాయలన్
మీ' రని వారిమేనులను మెల్లనఁ దట్టుచు ధౌతవస్త్ర సం
భారము శీతలౌషధ సమన్వితమున్ బనివెట్టె, నంతటన్.

నయనయుగమ్ములో నుడియు
సంబువులున్ మెయిఁ బొంగి పోవుచున్
రయమునఁ బాఱు నెత్తురి లొక
రంగయి సారెకు సారె తాకుటన్

మెయికొని యెఱ్ఱఁబాఱి మిఱు
　　మిల్లొసఁగించెడి కేలు మోడ్చి వి
స్మయపడఁ జూపఱెల్ల రణ
　　మల్లనువాఁడు వచించు యాచమున్.

మీ పాదమ్ములు ముట్టి పల్కెదము స్వామీ! దిగ్జయ స్తంభ ల
క్ష్మీశ్రీ పూజాకరణప్రతిష్ఠకయి మమ్మే ముం దనర్హమ్ముగాఁ
గోపుల్ గాయఁగఁ బూన్చినార లిది సిగ్గున్ గూర్చు శ్రీరంగరాట్
భూపాలాగ్రణిఁ దేని మాఁ బ్రదుకు లుండున్ బోకిటన్ మొండివై.

ఎంత శ్రమమ్ము పొందితిమొ యెవ్వరు చూచిరి, రంగరాయభూ
కాంతుని బంధనాలయముఁ గన్గొని యంతటిదాఁక నేల దు
ర్దాంతకరాసిఁ గ్రొచ్చుచు సారంగము వేసితి మస్మదీయ మూ
ర్ధాంతరమందుఁ బిట్టపిడుగై దురదృష్టము బ్రద్ద లౌనొకో!

చెఱసాల నడిమి కత్తెఱబోను కీల్కవా
　　టమ్ములోనికి సారంగమ్ముఁ దెఱచి
నడురేయి జడములైనన్ నిద్రగొను వేళఁ
　　జలిచీమ చావని సరణి వెడలి
పినతండ్రియాజ్ఞ వల్లన వేసికొనుచు, మ
　　మ్మును గాంచి యుల్కి, సుప్తోత్థ సింహ
పోతమ్ము సటవిప్పు పోలికన్ లేచి, య
　　యాచితదైవదత్తానుగతము

గాఢనిద్రా సుఖమ్మును గాంచు నిటకు
టుంబమును గాచుకొనుచు, జీవంబు లేని
పగిది శల్యావశిష్టుండై బడలియున్న
ఘనుఁడు శ్రీరంగరాయలు ఖడ్గమెత్తె.

ఎత్తిన లోనఁ దత్తరిలి యేమని శబ్దము సేయరాని నా
కత్తికరమ్ము నాగ నొడికమ్మున గొంపఱుఁ బట్టఁ, గొంద ఱా
క్కత్తుగ దూకి లోన నిమరించెదు కావలికాండ్ర గొంతుకల్
మెత్తగఁ దున్మినైవ, నటమీఁద వచించితి మున్న దున్నటుల్.

కలఁగన్నట్టు నిరంగరాడ్విభుఁడు పూర్కై చూచె, మా పేరితో
నిలఁద్రొక్కెన్ గొనయూపిరిన్, ఇటుల నిర్నిద్రాంగ రక్షా మహా
విలయస్థాన, మకాలమృత్యు నట దుర్వృత్తాంధ్రి ఘంటా ఝళం
ఝళ నిప్రాణము బందిఖాన మెటువశ్యమ్మయ్యె మాకంచునున్.

దేవా! త్వరపడ వలె నని
భూవివరము సూపి తెలిపి మ్రొక్కితి మధిక
స్తావికుల మైతి మా పని
కా విభుఁడు తెగింపఁ కిట్టులని తలపోసెన్.

ఈ దురదృష్టు నిం కింతట విడరాదొ
యీ భీరుకర్మ కే నెట్లు పొత్తు
యాచమా! నీ కెంత యవ్యాజభక్తి
విశ్వాస మీ ఘల్గురాజన్యుమీఁద,

నిర్భాగ్యదేవతాదుర్భరపరిశయతాం
డవ మహాపాదతాడనల డుస్సి
దులదుల రాలు నా తలను వెండియు నఖం
డితమ.శ్రీకలితకోటీర మీావు
నిలుప నెంత తెగించి యత్నించి తయ్యా!
నన్ను బ్రతికించు కొనుదో, నాకన్నతండ్రి
రామదేవరాయలు చాలఁడో, మడియంగ
నిమ్ము నన్ను, లేదింక లాభమ్ము నీకు.

అయిన, నీవంటి నిశ్చయభక్తివిశ్వాస
పూర్ణుని కాదని పుచ్చు టెట్లు?
మరణించుముందు నామాట దక్కించుకొ
నియె పోవుదును నేను, నీకుఁ దెల్పె
డి కృతజ్ఞతాభార మొక కొంత పరలోక
మందుఁ దగ్గును నాకు, యాచమా! వృ
థా నాకునై నీ ప్రతాపలక్ష్మికిఁ బని
వెట్టి కొనుట, నన్నుఁ బిలుచు చున్న
ది చెయి నూపి విసిఁగి మృత్యుదేవి, పోవ
నిమ్ము నన్, గోపగించును జుమ్ము, తత్క
రాళ విపృతాస్య దంష్ట్రా నిరర్గళోగ్ర
ఘట్టనమ్ముల హాయిగాఁ గరఁగిపోదు.

అని నేత్రపాళి సప్తాంబుధుల్ పొంగ, ఈ
పాడులోకము జోలి పట్టకుండ
గాఢనిద్రాదేవి కౌఁగలింతలఁ జొక్కు-
దారపుత్రులను గన్నారఁ గాంచి,
విపులనిశ్వాసమ్ము వెడలించి, వీరికై
యిటు నిల్చి చచ్చి పోవుటయ! కాదు,
పరిజనులకై మనుట నావంటివానికి యుక్త,
మని యాలుబిడ్డల నల్ల నల్లఁ
జరమకృతమై సముద్వేగజనితమై మ
హాబ్ధివలెఁ బొంగి ప్రేమ తొణ్కాడ నొక్క-
రొకరి శిరముల ముసుఁగుల నొడ్డిగించి
తడవి మాతో సారంగమ్ము దారి వెడలె.

మెలిగొన్న వివరమ్ము తలఁగక పాము పో
లిక లోని కల్లన డిగ్గి డిగ్గి
ఏటవాలుగ సాగి సూటిగాఁ బోయిన
గాడిలో జారి యంబాడి యాడి
చట్రాలు తగిలిన సందునన్ బోరలు
తాకి చెక్కులు వోవ దేకి దేకి
పాటినేలను ద్రవ్వఁబడ్డ క్రంతను గొంత
శ్రమవోవఁ గూర్చుండి జరిగి జరిగి

ఇంకఁ బది బార లంత క్రమించువేళ
బహుళజన్మపరంపరాపాప మొక్క
మాఱు మాతలన్ బ్రద్దలౌమాడ్కి, విఱిగి
పడె సొరంగ మొక్క తలారి పాదహతికి.

ఇంతే యాతఁడు కెవ్వుమం చెగిరి పోయెన్, బొబ్బరించెన్ భయ
భ్రాంతమ్మా నటు పట్టణంపుదళమెల్లన్, మంటిబెడ్డల్ తలల్
గంతుల్ గట్టఁగ నండ లండలుగ రాలన్ వాని దోర్త్రిపాడి మే
మంతన్ లేచెడిలోనఁ జుట్టుకొనె మ మ్మా జగ్గరాజైన్యముల్.

ఎంత శ్రమించి యేమిఫల మీ బ్రతుకుల్ భవదీయసేవకున్
గొంతగ నైన నోచుకొన కున్నవి, చేత జివున్నదాఁక నిం
తింతగఁ గండ లీమెయి వసించినదాఁకఁ గచాకచిన్ బరా
క్రాంతిని జూపికొంటిమి నిరర్థక మయ్యె సమస్తమున్ ప్రభూ!

రిత్తచేతులఁ దమ్ము దర్శింపలేక
ధన్యజీవులు కొంద ఱా జన్యభూమిఁ
గన్నుమూసిరి మావంటి కలుషమతులు
కొంద ఱున్నార లది తెల్పుకొఱకుఁ దమకు.

ఊడి పోనున్న జీవమ్ము లుగ్గఁబట్టి
వెంటనే రాక రంగరాడ్విషయ మెఱిఁగి
వచ్చినారము తత్పురీవనుల నిల్చి
గ్రుడ్డిలో మెల్ల కొంతకుఁ గొంత నయము.

రంగవిభుని సపుత్రకళత్రకముగ
రాయవేలూరు దుర్గకారాగృహమ్ము
నందు బంధించి యున్న వారంట మఱలఁ
బెద్దపౌజును గాపలా వెట్టి వారు.

దేవా! సెలవైన యెడన్
బోవుదు ఈ మీఁదు లెంకె పుట్టువు ధన్య
మ్మై పోవఁగ ఈ మాఱా
పావను గొనివత్తు లేక పడి చత్తు నటన్.

అయిదువందల కాల్బల మ్మేనుపదుల
దంతిబలమును రెండువందల తురంగ
బలముగల నా పటాలమ్ము సెలవుపెట్టి
డితని సేవలు మీకు ఫలించు దేవ!

అని సాష్టాంగము జోతవెట్టి రణవీరావేశుఁడై పొంగి ని
ల్చిన యోధున్ రణమల్లుఁజూచి కరుణార్ద్రీభూత మొక్కటియున్
ఘనవీరోజ్జ్వలదానవపావకసముత్క్రాంతీద్ధ మొక్కటియై
తొణకంగన్ బెణకంగ యాచముఁడుకుందున్ గందులోలోపలన్.

పొమ్మనఁగ లేఁ డిచటఁ బో
నిమ్మనఁడు మనంగ లేఁడు నిమిషములో భా
వమ్ము లనేకమ్ము లెదన్
గ్రమ్మ గొనన్ జూచి చూచి కడ కిట్లనియెన్.

రణమల్లూ! నిను మ్రింగి చంద్రగిరిదుర్గ మ్మింతటన్ వెళ్లఁ గ్రా
సెను జీర్ణించు కొనంగలేక, యిఁక నాచేసేత వేలూరి దు
ర్గ నరామ్రామిష ఖాదినీవదనదంష్ట్రాకోటి కెట్టుల్ నినున్
మనసారన్ బలియిత్తు, నీయ కెటు సంభావింతు రంగ్రాజుకై.

నాకున్ బొల్పడ, దున్మదిష్ణు వితఁడన్నా? మ్రేలునేమో యిఁకన్
నీకున్ దోచిన రీతిఁ జేయు మిపుడే నీతోడ నీ సర్వసే
నాకోటుల్ కొనిపోదొ నీ వయిన సైన్యమ్మొక్కటే కొంచుఁబో
దో కాకున్నొకరుండ వేగుదువొ లేకుందో యిటన్ చూవలెన్.

నాకు శ్రీరంగవిభుని ప్రాణములతోడ
నెవఁడు చూపింపఁ గలఁడో నా యెదుటఁబెట్టి
యమ్మహాత్ముని పాదద్వయమ్ము ధూళి
పోవఁ గడిగి మన్మూర్ధాగ్రమున ధరింతు.

అతని పాదోదకమ్ము నే నాచమింతు,
నతని కీ సర్వరాజ్య భూపతిశిరఃకి
రీటమణిమరీచులు నివాళించు, నాతఁ
డగు త్రిభువనీగురుత్వపీఠమ్ము మాకు.

అని వచియింపన్ రణమ
ల్లు నృసింహోగ్రోద్భయంకరుండై తద్యా
చనరేంద్రుని సెలవులు గై
కొని పోయెన్ రంగవిభుని గొనితే వేగన్.

మెరికలవంటి మేల్బిఱుదు కాల్బల మ్మైదు
వందలు వేర్వేఱువడుచుఁ జేర
వినువీధికెగురు నాశ్వికదళ మ్మొక రెండు
వందలొంటిగ మాటువడుచుఁ జేరఁ
గిరులుదాకి పిఱింది కరుగని హాస్తిక
బలమేఁ బ దేకాకివడుచుఁ జేరఁ
దనవంటి యుద్దండరణవీరు లేవురు
పగటివేసము పొందువడుచుఁ జేరఁ
దాను జయధరనామకోద్దండభయద
కదనవేదండ మెక్కి యొక్కండు చేరె
మతగురుని పోల్కి రణమల్లు మాటువడుచు
రాయవేలూ రమావాస్య రాత్రివేళ.

కాటుకముద్ద కార్నలుపు గ్రక్కెడి చీఁకటిలోన, భూమిభృ
త్కూటమువోలె భూగగనగోళము లేకము చేయుచున్, జటా
జూటము విప్పి యా నడుమఁ జొన్పి పురిన్ మృడుఁడేలునట్లు, లా
కోట భయంకరమ్మగుచు గోచరమయ్యెను వారి కెంతయున్.

తజ్జటాజూట పర్యటద్రట దభంగ
భంగ సంఘాత గంగా తరంగిణి వలెఁ
గోటచుట్టును బరిఖ గగ్గోలు రవళి
వారి ధాటిని నాకట్టి పరిహసించు.

అమవసచీకటింట వలె నందఱు నొక్కటఁ జేరి పెల్లు సం
భ్రమితమనస్కులౌచు నలుప్రక్కల కోటను జుట్టి వచ్చి, రా
క్రమణ మొనర్ప నెందుఁ గనరా దెగఁ బ్రాకఁగ నింత సందు, కా
లము వృథపుచ్చరాదు మఱలన్ జనరా దిఁకఁ బూన్కి యెట్టిలో.

నలుప్రక్కెడ జాఱుబండలు మలంచి
కట్టఁబడి యందు నిగిరి పోనట్టి తైల
రాశి పట్టింపఁబడి నట్లరాతిపీర
పరమదుర్భేధ్య మగుచుఁ గన్పట్టెఁ గోట.

రణమల్లునేత్రాగ్ని రాజె, బాహులు పొంగె,
నోడ లెల్లఁ బెరిగెఁ, బెల్లుడికె నెత్రు,
లొక్క డొక్కరి చెవి నూదె నేమిటో, కోట
గవను చెంతకు శీఘ్రగతిని జనిరి,
గవనుకావలికాండ్ర కంఠనాళమ్ములు
కిక్కురు మనకుండఁ గెడపినారు,
తత్కవాటము మృత్యు దారుణ వివృత దం
ష్ట్రాంతర్విసారిత జరఠ జిహ్వ
పోలె గుబ్బమేకులతోడ ముందు నిలిచె,
నేన్గుగమితోడ నది యొత్తిగింపఁ బూని,
రొక్క దంతియు ముందుల కొగ్గ దింత,
శూలములబోలు గుబ్బల చుఱుకఁ దగిలి.

ఉసిగొల్పి పరవడించిరి
త్రసరించి రొకింత సన్నలన్ మొనయింపన్
గసరిరి దువ్విరి చివరకు
విసిఁగిరి వేసరిరి కలఁగి విరిగిరి వారల్.

ఎటు లీ కోట జయించు, టీ తలుపు లెట్లీ మత్తనాగాళిచే
విటతాట మ్మొనరింపఁజేయు, టెటు లుర్వీభర్తనుం దెచ్చు, టి
చ్చోటుపోనాడి పిఱింది కెట్లు జను,టచ్చోఁ బంతముల్ వల్కి యు
క్కట నెగ్గించుకొనంగలేని బ్రదుకొక్కం డుండియున్ మండియున్.

అనుచు వారు పరస్పరాస్యములు చూచు
కొనుచుఁ గంపించుచున్నంత, మనసు చెదఱు
పోల్కి రణమల్లు బిరబిరన్ బోయి, తనదు
జయధరాఖ్యాకమత్తగజమ్ముఁ దెచ్చె.

తెచ్చి కోటగవను దెమలింప ముందుకు
జోపె, దానివెనుకఁ జూపెఁ దక్కు
దంతిసమితిఁ, గాని తలుపుగుబ్బలు దాఁకి
జయధరమ్ముగూడ జంకిపోయె.

చిటుకున నేమో తోఁచిన
యటు రణమల్లంత ముందు కరిగి సమీకో
ద్భటులౌ నేవుర సహచర
భటులన్ గని జేరఁ బిలిచి వ్యాహృతిపెట్టెన్.

కిమ్మనరాదు నానుడిని గెంటనురా దిట మీరు నేను బ్రా
ణమ్ముల కాస సేసి పయనమ్మును గట్టను లేదు తేని బం
ధమ్మును బాపుటే మనదుధర్మము, దానికి మీరలున్, గవా
టమ్మున కేను బ్రాణము విడన్వలె, నాపని ముందుఁ దీర్చెదన్.

నాపని ముగిసిన వెంటనె
మీపని ముగియింపవలె నమేయగుణుం డీ
భూపతిని యాచమేంద్రున
మీపమ్మునఁ బెట్టి సుఖము మీరలుకనుఁడీ!

అని కోటతలుపునపెనుగుబ్బ మేకుల
కాని నిలంబడి యాత్మదంతి
కాహ్వాన మొనరించి యావెన్క మత్తేభ
సమితికిఁ బెల్లు హెచ్చరికఁ దెలిపి
యొక్కమాఱుగఁ దల్పు లుచ్చిపోఁ దాఁకఁగ
సన్నలు వెట్టి యాచముని దలఁచి
నిశ్చలస్వాంతుఁడై నిమురుచు దంతిని
హుమ్మనె వెన్క గజమ్ము లొక్క
యూపు నూపెను జయధర మ్మాది నిలిచి
ముందటకుఁ ద్రోయ ద్వాతనిముఖముమీఁదఁ
దుండ మొగయించి వెనుకకుఁ ద్రోపులాడు
నెట్టి విడరాని చెలిమొ వా రిరువురకును.

నోరులేనిజంతు వూరక తనుఁజూచి
కనులచెలమ లూరి కాల్వఁ గట్టఁ
దుండ మెగయఁబట్టి త్రోపులాడుటఁ జూచి
నోరుగల్గు జంతు వూరడిలక.

వేదండ మెత్తు శుండాదండమును రెండు
కరముల బిగఁబట్టి యురముఁ జేర్చి
దంతమ్ము లోరగాఁ దలఁగి పక్కకు వచ్చి
చెవిదగ్గఱగ మోముఁ జేర్చి పట్టి
యభిమానసంపూరితాక్షిద్వయమునుండి
యొడలిలో రక్త మశ్రూదకముగ
జాల్వార వామహస్తమ్మును వినమిత
దంతికుంభస్థలిఁ దార్చి పట్టి
దక్షిణకరమ్ము తత్ఫాలతలమునందుఁ
గదిపి కంటికి కడివెడు కార్చు దాని
యశ్రుసంసిక్త నేత్రద్వయమ్ముఁ దడవి
గళము నిమురుచు గద్గదకంఠుఁ డగుచు.

ఇది యేమి జయధరా! యీ రోజుతో నింక
నీపేరు నాపేరు మాప నెంచి
నాఁడవటయ్యా! వెన్కంజ వేతువు జంకె
యెఱుఁగని నీకు జం కెవరు నేర్పె

రిది ధర్మమా యాచమేంద్రుని కొల్వులో
నాకుఁ దల్వంపైన నీకుఁ గాదొ
యవమానపడి మను మందువా నాకై వి
లాపింతువేల ధైర్యమ్ము పూని

వీరమరణప్రశస్తికి వీడుకోలొ
సంగుమిూ! నాకు, నీవు, నే చన్న వెంట
ర మ్మట నెదురుకోల్ స్వాగతమ్ముతోడ
నెదురుచూచెద నిఁక సెలవిమ్ము నాకు.

అని సైగ చేసి హుమ్మనెఁ, గాని తద్దంతి
ముందుల కడుగైన మ్రొగ్గలేదు
రణమల్లు త్రుటిలోనఁ బ్రళయార్కుఁడై పోయె
ఓ నోరు వాయియు లేని వట్టి
నీచపశూ! నమ్మి నిన్ సహాయోద్ధ
వం చెంత మోసమ్ము నందినాఁడఁ
బెద్ద కాయ మ్మింత పెంచు కొన్నంత నే
జంతుజాతికిఁ బరిజ్ఞాన మెట్లు?
పిఱికికండలు తఱిగిపోఁ దిరిగి పొమ్ము
నీమొగమ్మును జూడ జనించుఁ బావ
మంచు నఱచేయి సాచి యా హస్తిగల్ల
మదరిపో వైచెఁ జీకాకు నంది యతఁడు.

ఆ దెబ్బతోఁ దెలివంది నల్లేనుఁగు
కొండంత యైపోయెఁ, గుంభయుగళి
మునికాళ్ళపై వంగి రణమల్లు పాదముల్
ముట్టి చివ్వున లేచి మోహరించి
ధూమితవమధుసందోహమ్ముతోడ శుం
డాదండ మెత్తి యాపాదమస్త
కమ్ముగా నతని స్నానమ్ము గావించి త
ద్వదననేత్రమ్ములు తడవి చూచి
గళముచుట్టును బరిఁజుట్టి కౌఁగలించి
యతనికర మంది తుది సెల వంది నట్లు
హుమ్మటంచుఁ దదీయవక్షమ్ముమీఁదఁ
గుంభయుగళిని మోపెట్టి క్రమ్మివైచె.

మదమత్తేభము లొక్కటన్ వెనుక హుమ్మంచొత్తి నెట్టెన్ బదా
బదలై కోటకవాటముల్ పెళపెళధ్వానమ్ముతో దవ్వులన్
జిదురై పోయె, నురశ్శిరోధమనిమస్తిష్కాస్థిమేదోంత్ర నా
ళదృగాదుల్ రణమల్లుదేహమునఁ జూర్ణమయ్యెఁ బూర్ణమ్ముగన్.

అదరెఁ గోటగోడ బెదరె లోపలివాడ
చెదరె రక్షకాళి యెదిరెఁ బౌఁజు
లది భయంకరమ్ము కదనమ్ము తుములమ్ము
వారో వీరో తెలియ లే రెవారు

ఎదిరిన పౌఁజుఁ గత్తులనునెత్తి టకాటకి నొత్తిగించుచున్
బదమిడి త్రొక్కుకొంచు రణమల్లుతనూరుధిరార్ద్రఖండముల్
మదగజయూథముల్ తురగమండలముల్ ఘనబృంహణమ్ములన్
గదలఁగ యాచమేంద్రుబలగమ్ము హుటాహుటి నేగె ముందుకున్.

దుర్గవిభుఁడు నిప్పు ద్రొక్కిన మర్కట
మ్మట్టు చిందు ద్రొక్కి యఖిలసేన
మొగ్గరించి నిలుపఁ బూనులోపల దు
ర్గమెల్ల నాక్రమించె నెదిరిసేన.

కోటకవాటముల్ విఱుగఁగొట్టిన సైన్యము లెన్ని వేలకున్
దాటెనొ యెంద ఱెందు సరదారులు నుండిరొ యాచమేంద్రుఁడే
నేటికి వచ్చెనో ప్రళయనృత్యము సేయుచుఁ, జేయిదాటెఁ బో
రాటము, మైక మబ్బె, నిది రాణివినన్ బ్రదుకున్న దే యిఁకన్.

వినకపోదు గెలుపుగొనుట దుర్లభ మామె
యాన గడువరాని దదిఘటింపఁ
గొంత మెచ్చు పుట్టి కొంతకుఁ గొంతైన
బ్రదుకు నిలుపు తనకు మది కరంగు.

అని డేగ యొక్క దానికి
తనజాబు లిఖించి కట్టి తఱిమి భయభ్రాం
తనయనుఁడై యొక్కటఁ గి
మ్మన కతఁ డడఁగెన్ రహస్య మందిరమందున్.

ఉద్రేకభరితమై యున్న యాచముసేన
రణమల్లుఁ పేరితో రంకెలిడుచు
నెదురైన ప్రతిసేనఁ జిదిపి కత్తులఁ దచ్చి
రక్తకరోటులు బంతు లాడుకొనుచు
మూలమూలలు సొచ్చి మొనకట్టి దుముదారు
లగుచు నక్కినవారిఁ దెగడికొనుచు
మీ దుర్గనేత యెచ్చో నిల్చెఁ జెప్పుడీ
యని రాజమందిర మ్మడిగికొనుచు
వచ్చి ప్రాణార్తుఁడౌ దుర్గపతిని బట్టి
యెచట శ్రీరంగవిభుఁడు చూపింపు మనుచుఁ
దిట్టి, యతఁడు చూపింపఁ దద్విభు దృశించి
యెత్తికొని పొంగి జయశంఖ మొత్తినారు.

గర్వోన్మత్తులు వారు రంగవిభు వేగన్ గొంచుఁబో కచ్చటన్
నిర్వైరమ్మొనరించుకోఁగ మనసెంతేఁ బుట్టఁగన్ దిగ్జయా
ఖర్వధ్వానము లభ్రమండలము సంఘర్షింప రక్తప్లవ
త్సర్వారాతికళేబరప్రళయనృత్యమ్మాడి రుచ్చండులై.

ఆడి యాడి తుదకు యాచము కావార్త
తెలియఁబంచి తమ్ము నెదురుకొనఁగ,
శీఘ్రగతిని వారు శ్రీరంగవిభుతోడఁ
దిఱుగుఁ బయనమైరి మఱుదినమ్ము.

గుదిగొని వారు కోటగవనుక్ కడ చేరకె జగ్గఁ డుగ్రుఁడై
యెదిరెను బొబ్బరించె వలయాకృతమైన ఫిరంగిమంటలన్
జిదిపెను, నుగ్గునూచములయి చిందరవందరలై బికారులై
చెదరెఁ గలంగెఁ బోరిచదిసెన్ మసియయ్యెను యాచసైన్యముల్.

విజయవార్త యాచవిభునకుఁ జేరనే
లేదు చేరె ముందు రిపుల విజయ
వార్త రంగవిభుని బంది గైకొనిపోయెఁ
జంద్రగిరికి బల్మి జగ్గఁడనుచు.

నాస్తికురాలికి విజయ
మ్మాస్తికునకు నపజయమ్ము నలమెడి. మాయా
దుస్తంత్రమనుజశక్తి కు
పాస్తి యిడన్ బ్రొమ్గఁడాయె యాచముఁ డప్పుడున్.

దైవ మూఁదినిలిచి ధైర్యమ్ముతో ముందు
కడుగు వైవ సుఖము లందవచ్చు
ముందు ముం దటంచు భూరియుద్ధమునకే
యాచమప్రభుండు యత్నపడెను.

తంజాపురాంధ్రమూర్ధాభిషిక్తున కంపె
వీరగంధము నమస్కారపేటి
రక్తాక్షతలు పంపెఁ బ్రణతుల పొట్లమం
దలరించి యయ్యనధరణిపతికి

జోహారుటోఱఁ జొన్పి శూరఖడ్గ మ్మంపె
జిల్లేళ్ల శ్రీనరసింహపతికి
వీరాశిషమ్ము లంపించెను దామెర్ల
సోదరప్రభులకు సూడిదలుగ
రాణి మట్టువెట్టి రంగరాయలఁ దెచ్చి
చంద్రగిరికి మఱల స్వామిఁ జేసి
వీరపూజలొందు వేడుకతో నాఁడు
యాచమప్రభుం డయాచ్యబలుఁడు.

పూచిన కల్పకమ్ము వలెఁ, బొంగిన మోదరసాబ్ధి మాదిఱిన్,
వీచిన మందగంధవహవీచికరీతిని, దొడ్డినున్న స్వ
ర్ణైచికి పోల్కి, లోకమున రమ్యగుణమ్ముల నొప్పు రామకృ
ష్ణా! చిరభోగభాగ్యవిభవా! కృతవాసర వీరవాసరా!

శ్రీలీలాలాస్యచల
ల్లోలరవల్లలితనూపురోరురవశ్రీ
లాలితమణిశాలా! మ
ద్దాలకులా! రామకృష్ణధరణీపాలా!

ఇది సప్తమ ఖండము.

# చంద్రగిరి దుర్గము

## అష్టమ ఖండము

శ్రీ వితరణకంకణశో
భావిలసితహస్త! సుకవిభాషాభూషా
పావితమస్త! సమస్తో
ర్వీవైభవశస్త! రామకృష్ణవిభువరా!

దేవ! యవధారు సత్కళాదివ్యభావ!
తతమహాపాపగహనసందహనదావ!
సంశ్రితార్థిదుఃఖాబ్ధిసంతరణనావ!
కలితమృదురావ! లోకోపకరణసేవ!

నానావర్ణమతప్రచారదురితాంధధ్వాంతద్యోమణీ! దుర్మతి
ప్రాణాహారఫణాధరాసివినటత్పాణీ! యదృశ్యాత్మతే
జోనిద్రాణధరాసముద్ధరణదీక్షోదగ్రఘోణీ! మహా
రాణీ! మేల్కొనవమ్మ మ్రోసెడిని దుర్గద్వారనిస్సాణముల్

గండాంకాఖిలమండలేశ్వరమనోఖండాగ్ని కాదంబినీ
కాండమ్మై భవదీయహస్తధృతశిక్షాదండ మొప్పార వే
దండద్వంద్వము గంధవారికలశద్వంద్వమ్ము పూజోన్నమ
చ్ఛుండాకాండములన్ ధరించి చనుదెంచున్ లెమ్ము స్నానార్థమై.

రాజఖ్యాతిఁ గుమారసూర్యునను వెల్లన్ గొల్లఁగాఁ గొట్టి ని
ర్వ్యాజుండట్టు వెలుంగుచున్ సకలయామాగాధ్యప్రథన్ గొన్నత
ద్రాజున్ నేఁడు వధించి తానుదయసంధ్యాదేవి మేల్కొల్పె వి
భ్రాజద్రక్తకరమ్ము లెత్తి సుతునిన్ బాలార్కు లేలెమ్మఁకన్.

జేపెట్టున్ మునిప్రేళ్లపై నిలిచి పుంజీభూతరోషమ్ముపై
రేఁపన్ ఱెక్కలు విచ్చి నిక్కికొని యుద్గ్రీవమ్ముతోఁ గుక్కుట
మ్మాపీతారుణమూర్ధమండనశిఖామాణిక్య మూఁగన్ భవ
ల్లోకసాక్షిప్రతిమానబింబమటు, మేల్కొనమ్ము రాణీ! యిఁకన్.

కావేర్యంబుతరంగమంజులతురంగానీకముల్ డిగ్గి త్వ
త్సేవాతత్పరులౌచు దక్షిణమరుద్దేవంతు లేతెంచి రా
త్మావాసాగ్రనివిష్టముల్ కనకకుంభమ్ముల్ వివస్వద్ద్యుతి
శ్రీవిభ్రాజితముల్ ధగద్ధగ నిగారించున్ గటాక్షింపుమీ.

శ్రీరాజ్ఞీ! తమకున్ సుగంధకుసుమశ్రీఖండహారిద్రక
ర్పూరజ్యోతిరుదస్తకాంతులు నివాళుల్ వెట్టఁ బౌరాంగనల్
బారుల్ తీరిన వారు సర్వనృపసామ్రాజ్యాంగనల్ నీ పవి
త్రోరుశ్రీపదసేవకై వెడలి నట్లో రాణి! మన్నింపుమీ!

అని వైతాళికవందిమాగధికకన్యల్ స్తోత్రపాఠావళుల్
వినుపింపన్ సుమతల్పమున్ డిగి కవేరీకన్యకాసితగం
ధనిబంధామలకోజ్జ్వలాంబువుల స్నానమ్మాడి దివ్యాంశుభూ
షణకోటీరపరిష్కృతుక్ నెరపి రోషవ్యాలసంస్పృష్టయై.

ఓరీ! యాచమ! యెంతకూళ, విది ప్రత్యుద్దిష్టధర్మమ్మొ, వే
లూరన్ దొంగకుదొంగతోడుపడినట్లూపన్ ప్రయత్నింతొ, గొ
బ్బూరిస్త్రీ యొక పేలగింజవలెఁ గన్గోచయ్యెనే నీకు, ఈ
పోరాటమ్మున నీవొ నేనొ నిలుటక్ యున్నందుఁ జూడన్ వలెన్.

వ్రేలికి వైచినఁ గాలికిఁ
గాలికి వైచినను వ్రేలికా వైతువు పూ
జోలి యసలు నీ కేలను
మాలో మేమెందు దూకి మడియుదు మనినన్.

రామదేవుని రక్షించి రాజ్యమెల్ల
నేలుకొన నీకుఁ దక్కుఁగాఁ గాంబోలు, నోరి!
కూళ! వాని, నిన్ బట్టి మీఁగుండె లుచ్చి
శోణితముఁ ద్రావకున్న నే రాణి నటర.

అని తలంచి పిలువ నంపించి సోదరు
జగ్గవిభుని వేగ సముఖమునకు
నింతి కాపువెట్టి యేకాంతికపు మంత
నమ్మొనంగి నిశ్చయమ్మొనర్చి.

యాచముఁ డెంతకైన తగు, నాహవమాడఁగ డొంక, డన్నిటన్
సాచెను బార, లింక రఘునాథుఁడు వహ్నికి గాలి బాసటై
వీచినటుల్ సహాయపడు వీని దురాపదురంతదుష్టపై
శాచికకర్మ కెల్ల; నిటుసాగిన గెల్పనుమాట యున్నదే.

ఇటఁ గన్నముఁ ద్రవ్వించుట
యట జన్యము సేయఁ బంచుటా, యాచముఁడ
న్నిట సిద్ధపడుట యీ యా
న్నిటికి సిరంగవిభు బ్రదుక నిచ్చునె కాదే.

దూరము పారఁజూచు పనితోఁ బనిలే దిఁక రంగరాయలన్
దారతనూజబంధుసహితమ్ముగఁ జంపినఁ గాని తా నిఁకన్
దారికి రాఁడు యాచముఁడు తైత్తక లాడుట మానఁ డింత యే
లా రణరంగ మాతని గళమ్మునకే యురిత్రాడుగా నగున్.

రంగని పుత్రుని దొంగిలి
యింగితమే లేక చంక తెగనెత్తి కడున్
బొంగెడు నా పొంగెల్లను
గ్రుంగఁ దివియకున్న నింకఁ గోల్కానఁ గలమే.

బిఱుసేల కూళతో నని
యఱజాతికి రాయబార మంపఁగ నంతం
తొఱ గొడ్డెము లా నోటన
యుఱికెను మనియుండి చచ్చి యుంటిమి మనమున్.

ఇదిగో జగ్గవిభూ! మనుష్యహృదయమ్మే లేని సైన్యమ్ములన్
బదివేలన్ బనిగొల్పి యాచముని సైన్యవ్రాతమున్ జుట్టి త
ద్విదురప్రాయభుజోరుపంజరము నిర్భిన్నమ్ము గావించి యం
దొదుగంబాఱిన రామదేవుఁ గొనిరా నొక్కేత్తు శాసింపుమీ.

రామదేవుఁ దెచ్చి రణదేవికిన్ బ్రీతి
బలియొసంగ శాంతిపడెడు నామె
యాచముం డిఁకెంత యాచించినన్ గాని
పొంగఁబోన దూఁకొనంగఁ బోదు.

నే నీ లోపల రంగని
ప్రాణానిలపానమునకుఁ బనివెట్టెద నా
యీ నిశితాసికి, నీవో,
యీ నీ కార్యమునకుఁ జనుమీ శీఘ్రమునన్.

అని యతనిఁ బంచి, యాతని
కనుఁజుఁడు చినయోబన్నృపతి నాహ్వానించెన్
మనుజత్వ ముడిగి పోయిన
ఘనుఁ డాతం డెట్టి కార్యకారియుఁ గాడో.

గుండెలు దీసిన మానిసి
గుండాలను బోలు భటుల కొందఱ కతనిన్
దండిమగనిఁ గావించి య
ఖండగతిన్ రంగరాజు పైకెదికిఁ జనెఁ దాన్.

అది భీకరఘోరము కారాగార మాకోట
సమముగా నున్న, దేనాఁటినుండి
యెంత మానవమాంస మెంగిలి పడినదో,
యెంత రక్త మ్మాస్వాదించినదియొ,
తలుపునోటిని విప్పి తన కుక్షి నింపుచే,
వమనమ్ము తన కలవాటు లేదు,
పరిపూర్ణమేధాగ్నిఁ బచనమ్ము కాని మాం
సమ్మెంత తనకు జీర్ణమ్ము కాదు,
సత్యధర్మపరిశంసాప్రశస్తమాంస
మంగిటను వైచి నమలకే మ్రింగివైచు,
నెంత నరమాంసభోజిని యేని తాను
నాస్తికులఁ జూచి గడగడ లాడి పోవు.

దాని గర్భమునందుఁ దారాడు నిపుడు జీ
ర్ణావస్థ సకుటుంబరంగరాజు,
వారిపై నుక్కుఁజువ్వల పెద్దకటాకటా
ల్నడిమిగా నుదయసంధ్యాకృతఘ్న
నెత్తుటిజోతితో నిండారు ప్రత్యగ్ర
రవికిరణాగ్రభల్లముల నెత్తి
మోపెట్టి కసిదీరఁ బొడుచుచున్నది, పాప
మా దైన్యగతికి సహింకరించి

కటకటాల్రవ్వక్క నుండి పకాపక మని
నవ్వినది రాణి, శ్రీరంగనాథుఁ డగ్గి
యోరగంటను గాంచి తలొడ్డిగించి
విపులనిష్ఫలహాని శ్వాసవీచి విడిచె.

ఓరీ రంగ! తలొడ్డిగించి యటులేమో చూతు, వీ కోటకున్
జోరీ వేసెడి కన్నగానివలె దోఁచున్ నీదువాట, మ్మిఁకో
పాలుంబోత! యమాలయమ్మునకు నాహ్వానమ్ము నీ కీ భటుల్
తార్రై తెచ్చిరి, చిత్తగింపు మది ముం,దాపై భవచ్చిత్త మా.

రంగా! రాజ్యము నాది, నావిభుని దోర్దర్పార్జితమ్మైన, దు
ర్తుంగాస్మన్మతి నూర్జితమ్మయిన, దందున్ నీకు వాటా యెటుల్
నింగిన్ నేలయు నేకమా పగిది నన్నేమో దురాశాపరి
ష్వంగన్గాఁ బ్రవచింతు ఘోషలిడి సప్తాంగక్రియా సూత్రముల్.

కూళా! నీవును జాటుకొందు వటు నీకున్ నోరెటుల్ వచ్చు, భూ
పాలుం డియ్యది నాఁడు బుద్ధి పెడత్రోవన్ బట్టి నీ కుత్తుకన్
వ్రేలన్ దీసిన నాగపాశ మగు, దీనిన్ నీదిగాఁ జాటుదో
కాలుష్య మ్మది వోవఁ గత్తిపదనున్ నాకింతు నీ నాలుకన్.

ఎంతటి పొంగు, రాజ్య మిది యెల్ల భుజాపరిరంభణమ్ములో
నింతగఁ జిక్కె నంచు నెగనెత్తుదు చంకలు, దీనికోస మొ
క్కింత యిఁకన్ భుజమ్ము లెగనొత్తుదొ చూడుమ నిన్నుఁ గౌఁగలిం
పింతును మింట మంట లెగయించెడి యెఱ్ఱని యుక్కుకంబముల్.

సిందూరారుణకాంతిపూరరుచిరస్మేరాసన మ్మియ్యెడన్
గ్రిందై పోవు నదేమి? నీదు జనయిత్రీరాజ్యకాంతాస్య మా
నందోన్మత్తత మున్ముగొన్న యది ధ్యానమ్మారెఁ గాఁబోల్ !విష
స్యంది క్రూరఫణిస్ఫటావళులు ముద్దాడింతుఁ డచ్ఛాంతికై.

కణకణల్లాడు కంబములు కాఁగిటఁ బట్టెదొ, కత్తివాదరన్
మున్నిక్కొనన్నాళ్ళ నాకెదవొ, భూరిఫణిస్ఫట ముద్దుగొందువో,
య్యన్ను మొక్కటిందు, భూమివలయమ్మున నీవు మనంగరాఁ, దిఁకో
జనపతి! వీరు నీ మరణశాసనమున్ గొనివచ్చి రియ్యెడే.

నాకయ్యనా సుఖమ్మొకయి నాహృదయప్రళయాగ్ని శాంతికై
నీ కలుషాత్మ పోవవలె నీ తనువెల్లను బూదిగావలెన్
నీ కులమ్మున్ గుటుంబమును నీల్గవలెన్ త్రుటిలోన, దీనినిఁ
నీకయి నీవ చేసికొన నేర్తువొ? మమ్మొనరింపు మందువో.

పలుకుమిఁకా! యని రాణి ఒహుళ నిష్ఠురములు
కటకటార్భకక్కగా గడిమి పలికి
భ్రుకుటులు ముడివైచి వికటాట్టహాసముల్
పొనరించి కన్నుల నిప్పుకలు చెదరఁ
దన దృష్టి సారించి దారుణయమకింక
రోర్భుభీకరులైన వీరభటులఁ
జెఱసాల తలుపులు దెరువగా నియమించి
చినవోబనృపతిని జేరఁజేరి

యురుమహోద్దండఖడ్గమ్ము నొఱను బెఱికి
యతనిచేతికి నిడి 'పొమ్ము! యాలసింప
కొక్క త్రుటి వీరిగుండియ లుచ్చిపోవఁ
బొడిచి త్రాగుము రక్తముల్ పొట్టనిండ'

అని యురవడించి పంపినఁ
జనె నాతఁడు రక్తపానజనితాభిరుచుల్,
కనుగప్ప; వచ్చువానిన్
గని రంగవిభుండు లేచి కలఁ గన్నట్టుల్.

విపులనేత్రద్వయిన్ వెలువడు నిశ్చల
దృక్కుల 'నిలుము! నీ వింక నచట'
యని మేఘమంథరధ్వని ననెఁ, జకితుఁడై
యనుకొని యట్టుల నతఁడు నిలిచె,
నపుడు రంగప్రభుం డాత్మఁ దమాయించి
యను 'నేది నీచేతి యమృతఖడ్గ
మిటు తెమ్ము! మా తల్లి యిడినది యిది కాదె
చరమబహూకృతి సల్పి మాకు,
నింక నీ వేగుమయ్య నీశంక దక్క
మయ్య! మా యమ్మ యిడిన యనర్ఘఖడ్గ
దానము తిరస్కరింప మా కౌనొ? ఆమె
యేది యనుకొన్నఁ జేయంగ లేదొ? మాకు,

అని ముందు కడుగిడి, యట నిశ్చలాశ్చర్య
దిగ్ధుఁడై, తనవంకఁ దెల్ల వోయి
కనుఁగొను చినమోబజనపతిచేతిఖ
డ్గము లాగికొని, వెన్క కల్లనఁ జని
నిరువురఁ బుత్రుల నిరువురఁ గూతులఁ
గన్నారఁ గని, యురస్కంధమందు
వారి శీర్షము లొక్కమాఱుగా నొదిగించు
కొని, లేచి, యాప్రక్కఁ దనను జూచి
కలఁగి కంటికి కడివెడు కార్చు భార్యఁ
గాంచి, యిదియేమి! శుభవేళఁ గంట నిడుదు
బాష్పములు, నేను మరణింప నలయునంట!
అటు పయిని మీరు, నెంతటి హాయి చావు!

పిచ్చి దానవు దైవ మెచ్చట లేఁడు, మా
యామేయనరశక్తి కతఁడు లొచ్చు,
తిరిగి మానవజన్మ దొరక దేమో యంచు
భయమందుచుంటివో? వద్దు వద్దు,
దైవభక్తిని నద్ది తలదన్నుఁ గాక ఆ
నరహంతృతాదాష్ట్యభరదురంత
దుర్భరనరజన్మంతో మన కికఁ బని
లేనటుల్ చరమాంజలిన్ ఘటింపు

మతివ! యని, యెగశ్వాసతో, ఆమె బాష్ప
సిక్తనయనముల్ తుడిచి సంసిద్ధపఱచి
నిడుదకత్తి నురమ్మునఁ బొడిచి లాగె
వెనుక ముందఱ నెత్రు లువ్వెత్తు సిగిడె.

ఆ రక్తధారఁ దడియుచు
శ్రీరంగవిభుండు కనులఁ జీఁకటు లెసఁగన్
దారాడుచుఁ దన పెద్ద కు
మారున్ నిజకృత్తికిన్ సమర్పణ పెట్టెన్.

ఇపు డాతఁ డున్మత్తుఁ, డెఱుపుఁ బాఱిననేత్ర
గోళమ్ములన్ గృపాకూప మిగిరె,
మునివ్రేళ్ళు కొంకరల్ పోవఁగాఁ బుత్రర
క్తప్లావితక్రూరఖడ్గ మెత్తి
తనవంక హృదయనిర్దళనదైన్యవ్యాకు
లాక్షుల నంబువుల్ పాఱఁ గాడఁ
గనుఁగొను రెండవ తనయుని పసిలేఁత
ఱొమ్ములో లోతుగాఁ గ్రుమ్మి లాగె
బాలుఁ డదవదలై నేలఁ గూలి పోయెఁ
గ్రింది రక్తప్రవాహమ్ము లేకధాటిఁ
బర్వి పాతాళగంగలోఁ బడెను, మీఁది
ఘనరుధిరధార లాకాశగంగఁ దాకె.

ఆ యురవడి నాతఁడు దై
తేయునివలెఁ బోయి దీనదీనాననమై
కూయిడు జ్యేష్ఠకుమారిక
యాయువులను దీసె నెడఁద నసి గ్రుమ్మి వెసన్.

కటకటాల్పందుగా వానిఁ గనుచు రాణి
వికవికా నవ్వె గర్భదుర్భేదనముగ
సరిగ నై దేండ్లు నిండని చంటిబిడ్డ
బెదరి యొడిఁజేరి యాతండ్రి బిగఁబట్టె.

బిగఁ బట్టిన నిసుంగు వీక్షించి వంగని
నయనాలు చల్లనై నవ్వు లూరె,
నలిగి పోయిన జీవనాడులు కంపించె,
రాణి వేసిన గేలిఱంకె మఱచె,
బెదరిన బిడ్డను బాదివి బాహుల నెత్తి
యక్కునఁ గుదియించి యపటు న్నూన
శిరమున శిర ముంచి చేసేత వీపుపై
జోకొట్టి య్యల్లనఁ జుంచు దువ్వి
క్రిందికిన్ దించి చుబుకమ్ముఁ గేలఁ బుణికి
అమ్మ! మన మాలసింపరా దరుగవలయు
అమ్మయు, మఱి అక్కయ్య లన్నయ్య లంత
ముందుఁ బోయిరి, మనమును బ్రోవ వలదె?

అని బుజ్జగించెడి జనకుని గని బిడ్డ
యనును 'నన్నయ్య, లక్కయ్య, లమ్మ
యేలపోయిరి? మన మేల పోవలెఁ దండ్రి?
పోవుట యనఁ గత్తిపోటుచు టగునా!
యటులైన నేను రా; నది చూడ భయమౌను,
నమ్మయు మీరలు నరిగి రండు,
మనము పోయినవెన్క మనవెంట వీరలు
వత్తురో' యని రాణి వంకఁ జూపె
రాణి పటపటఁ గొరికి పండ్లనియె 'నోసి!
యింత లే వెంత నేర్చితే యీ వయసున!
నఖిల సుఖములు మే మిట నారగింతు,
మటను బనిలేదు మాకు, మీ రరిగి రండు.

బిడ్డమాటకు లోన విపుల నిస్పృహఁ డోచు
రాణిమాటకు వ్యథాత్రణితుఁ డగుచు
రంగరా జనుఁ 'దల్లి! ప్రజల సొత్తెల్లను
దొర యను పేరితో దోచి దోచి
ఆపోశనము పట్టి పాపఫలమ్ము సం
పాదించు కొంటిమి, మా ఫలము సరక
మందుండె, దానికై మన మేఁ పలెఁ గాని
వీర లచ్చోటికి రారు తల్లి!

అంతకంటెను వీర లత్యధికదుఃఖ
నిష్ఠురాఖండకటువిషాగ్నిచ్ఛటాళు
లలము చోటికిఁ జేరువా, రంత ఫలము
వీర లిచట నార్జించుకొన్నారు తల్లి!

ఆ మాట కుటిమి చూచుచు
నేమీ నీగర్వ మెంత కెత్తిన దారా!
నోరుస్ మూయుము, నీపని
పూరింపు, మటంచు రాణి బొబ్బయిడియనెన్.

ఎంత దుశ్చింతాసమీక్ష్యాకారిత గల్గి,
వెలి కొండు లోపల వేఱొకండు
వర్తిల్ల, గోముఖవ్యాఘ్రమై, సత్యధ
ర్మాడంబరోరుదంష్ట్రిసఖాళి
విప్పి, యమాయికోర్వీప్రజాసంఘగో
వును మెల మెల్ల గొంతును విదల్చి
యప్రమాంసము లెంత హాయి గ్రోలిన నంత
యతిలౌకికవ్యవహర్త వాఁడు,
నరక మనుమాట కల్ల, స్వర్నగరిమాట
పొల్లు, నీ విపుడొందెడు భూరిదుఃఖ
మే మహా నరకమ్ము, నే నిపుడు పొందు
సమధికానందమే మహాస్వర్గ మోయి!

అనుభవింపు నరకయాతన, నీ వెంత
యనుభవించుచున్న నంత నేను
ననుభవింతు సమధికానంద నాకసు
ఖమ్ము రంగ! వ్యవధి కలుగనీకు.

అని పల్కి వికటాట్టహాస మొనర్ప నా
తఁడు తదుక్తిజ్వాల కుడికి పోయి
యనుఁ 'దల్లి! నీకత్తి యమదంష్ట్రి మాపాలి,
కెటు పోవ మాకు దారేది? దేవుఁ
డేడి? నిత్యము తననే నమ్మి సత్యధ
ర్మప్రశస్తికి మేని రక్తమాంస
ములు వ్యయించి శ్రమించి కొలుచు మమ్ములఁ గావ
రాఁడేమి? యిపుడు నీ రాక్షసత్వ
దీర్ఘదంష్ట్రిలు నఱకఁ డదేమి? నీ భ
యంకరతను డింపఁ డిదేమి? యరయ శ్రుతిపు
రాణగాథలు వట్టి కల్పనలు, నాస్తి
దేవుఁ డహాహా! నీ మత మెంత దివ్య మమ్మ!

తల్లి! యుడికెడి నా హృదంతరగభీర
గుప్తభక్తిప్రవిష్టలోకోత్తరుండు
కలఁడు కలఁ డమ్మ! యతఁడు జగద్గురుండు
నమ్మ నామాట నీకు జయమ్ములేదు.'

అని గిరుక్కునఁ దిరిగి బాష్పాంబుధార
లలముఁ గన్నులఁ బసిబిడ్డ సరసి యరసి
వెనుదిరిగి కత్తి భూమి మోపెట్టి వంగి
సత్తువకొలంది వక్షమ్ము నొత్తుకొనెను.

పిడిదాఁక నతఁడు దిగఁబడెఁ
బుడమికి సాష్టాంగపడుచు మొఱలిడినటు, లీ
చెడుకర్మ కట్టి కుడుపక
విడుచునొ తత్ప్రేరణాప్రవీణన్ రాణిన్.

ఈ కఱకుఁబిల్ల యొక్కతె
చాఁకే? లరిశేష ముంచఁ జన దెప్పుడు నం
చా కసుగందు గళమ్మున
నా కత్తిని లాగి దింపి యరిగిరి వారల్.

విమలప్రసన్నదృష్టీ!
యమలవచోమధురవృష్టీ! యానందకళా
రమణీయహృదయతుష్టీ!
శమదమసంపద్విశిష్టసద్గుణపుష్టీ!

వినయశ్రీ కోక యాలవాల మని యుర్వీదేవిలావణ్యయా
వనసుశ్రీ కోక భూరితృప్తి యని శశ్వత్పాండితీగౌరవ
ప్రణవశ్రీ కోక వేదబుక్కని బుధప్రస్తావనన్ గీర్తిఁ గాం
చిన మద్దాలజరామకృష్ణవసుధాసీమంతినీసద్వరా!

ఇది అష్టమ ఖండము.

# చంద్రగిరిదుర్గము.

## నవమఖండము

శ్రీ మత్సుజననమస్యా !
ప్రేమస్మేరాస్య ! సత్కవీంద్రోపాస్యా !
కోమలసముచితహాస్యా !
శ్రీమన్మద్దాలరామకృష్ణమహీశా !

దేవ ! యవధారు, గౌరవశ్రీవిరాజ
మానమద్దాలవంశసంపత్ప్రభావ !
బుల్లితాతయనర్సమాంభోజపదర
జశ్శిరస్సీమ ! సాహితీసార్వభౌమ !

రాణి యెంతటి క్రూరరాక్షసి ! సకుటుంబ
ముగ మ్రింగె నఁట ! రంగభూమివిభుని;
ఆమాట నెత్తకు, నతనికిఁ గల్గిన
భీకరమృతియె ప్రాప్తించు మనకు,

రాణిపై యుద్ధమ్ముఁ బ్రకటించిరఁట ! యాచ
 మేంద్రుండు తంజాపురీశ్వరుండు,
మన కది యేల ? యీ మాట చారులు పొంచి
 తెల్పిన నేఁటితోఁ దీరు మనకు,
వార లిర్వురె యేకమై పోరునెడల
రామదేవుండు తప్ప కీ రాజ్యమునకు
నొడయుఁ డయ్యెఁడు, నేల యాగొడవ లెత్తి
కొంపపైకి వృథా తెచ్చుకొందురయ్య !

అని మూలమూల లందున
నణఁగి, ప్రపంచమ్ము సర్వ మట్టుడుకుగతిన్
జను లాడుకొనుచుఁ దమ రవి
విసీవినని యట్టు పైకి విహరింత్రు వెలిన్.

నిలువునఁ బ్రాణముల్ బలిగొన్నదఁట!. రాణి,
 వింటిరే ! రంగరాడ్విభుకుటుంబ
దుర్గతి ; యెంతటి ధూర్తత్వ ముండిన ?
 నింతటి క్రౌర్యోగ్రహింస తగదు ;
రంగరాడ్విభు మేని రక్త మానిన కత్తి
 మనరక్త మానక చనునె తేఁపు ?
నాస్తికురాలికి నరమాంస మింతగాఁ
 జవియైన దటో ! యింక జగము మనునె ?

యనుచు లోలోన హడలెత్తి, యాస్తికప్ర
బుద్ధు లుద్బోధచేసి, ప్రభుత్వమందుఁ
జీలికలు వెట్టి, యతిరహస్యకృత్యోగ్ర
విప్లవానలబీజముల్ విత్తినారు.

ఉగ్రుఁడై యాచముం డుద్బోధ నొసరించెఁ,
బాడయ్యె శ్రుతిధర్మపాఠనములు,
ధర్మార్జనోపాయతాత్వికచింతన
మ్మడుగంటె, వ్రతరహస్యమ్ము సమసె,
జపతపఃపద్ధతి యుపరతమ్మయ్యె, స్వ
ర్గాభిషంగమకమార్గమ్ము చెడియె
సారూప్యసాయుజ్యసాహూమనస్త్య్యవిమో
క్షప్రాప్తియుక్తి ధ్వంసమ్ము నయ్యె,
ఆస్తికులు చచ్చుటాయెను, నాస్తికాళి
హెచ్చుటాయె నీ రాణి పాపేచ్ఛకొఱకు,
ఇది పవిత్రకర్మక్షేత్ర, మెటు సహింప
నౌను? దుర్భరమర్మవర్తనమ్ము నీమె.

ఊఱుకుఁడు తెన్గుఁగత్తులకు హాళోళిగ నేయుఁడు రాణియాయువుల్,
తఱుగుఁడు సన్నసన్నముగఁ దగ్గని జగ్గని మేనికండలన్,
నఱుముఁడు నాస్తికప్రవచనోగ్రముఖమ్ములు, తెన్గునెత్తుటన్
బెరిగిన మీర లూరక విభీతికి దోసిళ్ళు లొగ్గఁ జెల్లునే?

బంగరువంటి వైదికము భస్మముచేసి సదంగరక్షకున్
రంగవిభున్ బవిత్రుని గళత్రతనూజయుతమ్ముగా మహో
త్తుంగదవార్చి కాహుతిడి వొంగలు పొంగెనరయ్య! నాస్తికుల్
వంగినవో తెనుంగుఁబిడిబాకులు మీ కుడిచేతినాలికల్.

అమృతమువంటి తీయనగు నాష్టమతోత్తిక ఘస్రవంతిలోఁ
గుమతులు నాస్తికుల్ హలికభుగుగ్రవిషమ్మును గ్రుమ్మరింపఁగా
సమకొని, రీ దురంత మిటు సాగఁగ నిచ్చిరఁ దెగ్గుఁబుట్టువుల్
సమయవె? దూయుఁడీ విమతరక్తపరాయణముల్ కృపాణముల్.

లెండో తెల్గుమగంటిమిన్ జన్ము నూరింపంగ వేళయ్యె, మీ
యండన్ నిల్చెను వేదధర్మ, మిపు డాస్య మ్మెత్తుకున్నన్ మతా
న్నండో యీమన తెన్గుదేశముప కౌన్నత్యమ్ము? లెండయ్య!యు
చ్చండా యోధనయోధమూర్తులయి తజ్జగ్రాహి నుగ్గాడఁగన్.

కండో యింకఁ దయారు భూభుజచక్రస్వామ్య మెవ్వారి దో
ర్దండోన్మండితమో వినిర్ణయ మొనర్పన్ వేళ యేతెంచె, బ్ర
హ్మాండమ్మం తొక చక్కిలమ్ముగ గ్రసింపన్ బాలుపడ్డట్టి యు
చ్చండస్వామిని రాణికోటులఁ బెకల్చన్ గాలమున్ దగ్గఱెన్.

రండో తొల్లిటి తెల్గునాయకుల వీరావేశసంపత్తికిన్
గుండెల్ కానుక లిచ్చి యొక్కటయి చేకోఁబూర్వికౌన్నత్య, ము
ద్దండుల్ మీరలు నిల్చినన్ మునుమునన్ దామెంత?నాస్తిక్యమెం?
తండల్ గూలిన యట్ల కూలుదురు జగ్గాద్యుగ్రదైత్యాధముల్.

గంపుంబొపుసుగంటిమింగల తెలంగాజోదులారా! యశో
డిండీరమ్ములు వేయుఁడీ! దశదిశాలేలిహ్యమానోజ్జ్వలా
ఖండధ్వానములన్ ఘమాఘమితఘంకారమ్ములన్ నేఁడు వే
ధోండమ్మెల్లను మాఱుమ్రోఁగి హాడలెత్తన్ రాణి నిర్వాణియై.

అనుచు నుద్బోధించి యఖిలప్రపంచ మొ
 కూర్కొపూపె యాచముం డుత్తరంగ
రంగత్తరంగిణీసంగతోత్తుంగాబ్ధ్యి
 కుంతగర్జాభంగిఁ గంతమెత్తి,
యార్షధర్మప్రధానానుయాయిప్రజ
 మ్మాగర్భలక్ష్మీకుమారసమితి
యంగమ్ము లుప్పొంగ యాచమున్ జేరె, ము
 ప్పదివేలపోఁజు పోరిసయ్యి, నంత
దండు సాటింపఁజేసి ప్రస్థానభేరి
వైచి, తంజాపురమ్మును వదలి యెదురు
వచ్చు రఘునాథరాయలబలముఁ గలియ
నడిపెఁ దనసేన కుంభకోణమ్ముదిక్కు.

యాచమాంగ్రభయంకరార్భటి విని రాణి
 జృంభించి యుద్బోధ చేయు సాగె,
దైవమ్ము వైరఁ బెకిడబ్బరల్ చెలరేగెఁ
 గర్మపేరను డాంటకమ్ము రేగ

సకలశాభ్రాతృత్వవికటాట్టహాసమ్ము
        మహితమాయాగుహాన్ మాఱుమ్రోఁగఁ
బరలోకపుణ్యపాపప్రలాపస్వార్థ
        తత్పరత్వపిశాచతాండవమ్ము
లుర్వి కంపించి పోవ నుద్భ్రాంతలూఁగె
కల్పితస్వర్గనరకలోకములు చూపి
స్వీయధనరక్షణోపాయమాయ యనెడి
మతము పేరిటి గజదొంగ బ్రతుకసాగె.

ఏ యమంగళవేళ నీ ద్రావిడులనెత్తి
        నడుగువెట్టెనో వైదికార్య మతము
ఏ దుర్దినమునందు నీ ద్రావిడులకొంప
        లంటించెనో వైదికాగ్నికీల
ఏ దుర్ముహూర్తాన నీ ద్రావిడులనోరు
        నొక్కెనో వైదికాన్యాయశక్తి
ఏ యరిష్టదినాన నీ ద్రావిడులసిరుల్
        హరియించెనో వైదికార్థశఠుఁడు
నేఁటికిఁ దలెత్తుకొనలేక నిలువనీడ
లేక నోర్విప్పలేక దరిద్రమయ్యె
ద్రావిడాంధ్ర మహింస్రాతప్రశస్తి,
ఎటు సహించుట ? సవనగోహింస్రకర్మ.

జోనటో! పాషండు డస్తినాస్తిమతాల
కావల వెలసిన యమృతమూర్తి
పతితుఁడా? సవనగోవధకర్మ ఖండించి
కరుణాళు వైనట్టి కర్మయోగి
అర్హుఁడా! విశ్వవిశ్వాఖండపావనా
నందప్రదుఁడు శాపనార్థములకుఁ
దగుఁడటో? సత్యధర్మాహింసలకు వాహ
నమ్మైన ముని బ్రాహ్మణార్థములకు
నెంత ఘోరము! లోక మహింస యనెడి
దైవమును వీడి యెచటికో దైవముకయి
పోవుచుండెను స్మృతులయభూతశిల్ప
నాస్పదమ్మగు జగతియుట్టముగుదారి.

దైవము దైవ మం చరచి దబ్బఱలాడఁగ జెల్లునే! జగ
త్సేవకు మించి దైవ మెటఁ జిందులుఁ ద్రొక్కెడున్, నీకు నాకు లో
కావనశక్తిమాత్ర మొకటన్నిట వెల్గును, గాని నీవలెన్
జీవుఁడు శాశ్వతుండను విశిష్టత కొప్పను మించి గాలికిన్.

జన్మింతువా? లోకజననకారణబీజ
భూమియా మాతల్లి భూమి మించి
జీవింతువా? జగచ్చేతనాకారి యౌ
యురుజీవదాత వాయువును మిగిలి

బ్రదుకఁ గానుదువ? కృపారసరూపి మా చల్ల
నగు తండ్రి జలదేవు నవఘళించి
పలుకఁ గానాడుదో? బహువిధశబ్దర
మ్యయగు మా జనని వియత్తు వదలి
వెలయుదువో? లోకకల్యాణలలితమూర్తి
బహుపవిత్రుఁడు మాతండ్రి జ్వలను వీడి
తెలుపుమో రిక్తకల్పితదేవపాద
పూజకా! పాంచభౌతికమూలపురుష!

నరకము నాక మందువు కనంబడ వవ్వి, పురాజనుఃపరం
పర యని పుణ్యపాప మని పల్కెదు వానికిఁ దావు లేదు, దు
ర్భరమగు కర్మ యందు వది పచ్చియబద్ధము, వీనికెల్లఁ బై
దొరగను దైవమున్ నిలిపి దొంగగ దోచెదు విశ్వవిశ్వమున్.

పెళపెళార్భటి రేగి పెట్లిపోయెడి విద్యు
దావేశితాగ్నిగ్రహాలతోడఁ
గరఁగు లోహద్రవ మ్ముర్వడింపఁగ భ్రమ
ద్భ్రమితమ్ములౌ నెబ్యులాలతోడ
నిప్పులవాయువుల్ నిగిడి వీవఁగ భగా
భగమండు తారకాపంక్తితోడ
నగ్నిజిహ్వాలు సాచి యన్యగోళములపైఁ
బడుచుండు నక్షత్రపంక్తితోడ

సందు లేకుండ నిండి జ్వాజ్వల్యమాన
గమననిరతాగ్ని కుండమా గగనమందు
నీ పురాణేతిహాసకథాపునీత
దివిజభూములు నిలిచిన దేశ మెచట?

అని రాణి సమస్తోర్విని
ఘనపటహధ్వాన ముబుకఁగాఁ జాటింపిం
చెను; వట్టి యమాయిక
జనసంఘము రెచ్చి యామె సేనగ మాఱెన్.

తుండీరమండలాఖండలుం డనఁగఁ బే
        రందిన ముద్దుకృష్ణప్పవిభుఁడు
పాండ్యమండలమహాప్రభువనన్ బ్రఖ్యాతి
        నందిన మధురవీరప్ప తేఁడు
సామంతవిభులలోఁ జాలఁ గీర్తిని గొన్న
        దిట్ట నాపిళ్ళతి త్తిప్పసెట్టి
దండనాయకుల నుద్దండుఁ డన్న యశస్సు
        నందిన రాతుమెజ్జమమగండు
పురముతిమ్మనీఁడు భుజబలరాయండు
ప్రముఖు లెల్ల పూర్వవైర మెంచి
యాచమేంద్రు విడిచి యాత్మబలాలతో
వెడలి రాణిసేన విడిసినారు.

తానున్ యాచమనాయఁడయ్యెదనునన్ దారాపథమ్మంటె మె
న్నెనిన్ భంగుల రంగరాయవధ నింటింటన్ విచారాంబుధుల్
మేనుల్ దాల్చెడిరీతిఁ జాటి జగమున్ ద్రిప్పెన్యథార్థార్థమున్
సానుక్రోశముగా నెఱింగి తనపక్షమ్మెల్ల విజృంభింపఁగన్.

రామవిగ్రహపూజ రామనామజపంబుఁ
　　జేసి శ్రీవైష్ణవాశీస్సు లంది
జయగరుడాద్రిపూజాఘంటికలు మ్రోయ
　　రామభద్రగజాధిరాజ మెక్కి
ధీరుఁడౌ గోవిందదీక్షితసచివోత్త
　　ములు మదేభముపైని గొలిచి రాఁగ
రాజులు మన్నీలు రాతులు దొరలు వా
　　జులపైని బ్రక్కల ఒలిసిరాఁగఁ
గాల్బలము ముందుఁ బుడమిఁ గ్రక్కదిపి నడువ
శ్రీమహాచోళపురసార్వభౌమబిరుద
రాజితుండగు రఘునాథరాయవిభుఁడు
కదలె యాచమజయరమాసదనుఁ డగుచు.

ఉత్తరమల్లూరియొద్ద నడ్డము రాఁగ
　　దావలుపాపని దఱిమి కొట్టి
తిరుమలలోఁ బొంచి యురవడిఁ జూపిన
　　మన్నెరాజుల నెల్ల మట్టుపెట్టి

చెంగలుపట్టునఁ బొంగి యెదిర్చిన
        రాచసర్దారులఁ బీచమణఁచి
పాలెంబుకోటనెల్పుట వేచి పైఁబడ్డ
        యతిరాజు నాజిలో హతముచేసి
తనకు నెదు రేగుదెంచు విస్తారబలుఁడు
ఘనుఁడు రఘునాథరాయుని గలిసికొనఁగఁ
జేరెఁ గావేరితీర 'తోపూరు'గ్రామ
పరిసరమ్మును యాచమప్రభుఁడు నాఁడు.

కావేరీతీరమె యు
ద్ధావనిగా మాఱిపోయినది తోపూరే
జీవమ్మైనది యని కీ
ర్త్యాప్తులు సరి పంచుకొనిరె రక్తాక్షికలన్.

యాగీయైనది రాణి ధ
రాగురుతర రాజ్యవిభవలక్ష్మికయి దురు
ద్యోగినియై రంగ్రాయని
లోఁగొని వధియించె నంచు లోకములోనన్.

జగతిసానుభూతి సంపూర్ణముగఁ గొని
పటుత యాచవిభుఁడు పౌజుఁ దీర్చె
నాత్మపశుబలమ్ము నాధారముగఁ గొని
కాలు దువ్వె రాణి కలని కెక్కె.

లెక్కఁగట్ట వీలు లేనంత సైన్యమ్ము
పిక్కటిల్లె రాణివప్రక్కఁ నిలిచి
వేళ్లమీఁద నెంచ వీలైన బలగమ్ము
యాచవిభునిమూపు గాచియుండె.

మాదిసీనికడిందిమగఁటిమి కెదురుగాఁ
చెన్నప్పనాయుండు చెలఁగినిలిచె
మాకరాజుపసందుమగసిరిముందుగా
నయ్యనవిభుఁడు సయ్యాటలాడె
వెంకటు టక్కరిమొత్తు వేయుటె తడవుఁగా
వేంగళవిభుఁడు కవ్వించి దూకె
దళవాయిచెంచు ముందలకు మ్రొగ్గినవెంట
నరసింగపతికంటి కెఱుపు దోఁచె

జగ్గరాజు పట్టుపగ్గాలు లేకుండఁ
బరవిడించి ముందు కురవడింప
యాచమప్రభుం డమాచితపౌరుష
జ్వాలతోఁడఁ జేతివాలు ద్రిప్పె.

తోడరి దారియిడక తుండీరవిభుఁడు తా
నెంత యడ్డుకొన్న నిట్టె గెలిచి
కడఁగి మధురవిభుఁడు కావేరివంతెన
నెంత చెఱుపుచున్న నిట్టె దాటి.

తంజాపురభర్త ధను
శ్శింజారిపుగర్వహర్త సేనను దా ముం
దంజై వడిఁ దెచ్చుచునుం
డం జతురత రాణి తెలిసి డాసె నెదురుగన్.

కటుశిరస్త్రాణమ్ము కమనీయనీలకుం
తలదీర్ఘవేణి కన్పడక తాల్చి
పటుతనుత్రాణమ్ము బహుళభవ్యవక్షోజ
యుగసమున్నతి క్రుంగుపగిదిఁ దాల్చి
భయదదీర్ఘకరాసి పాణిపల్లవరాగ
మృదులకాంతులు దోఁపనీక దాల్చి
ఘనకఠోరగ్రంథి కాసెకోకను కటీ
తటభార మణఁగుచందానఁ దాల్చి
మేలినిగనిగజిగివెల్గు డాలు పూని
చాల పొడవైన యొజ్జ దట్టివ్రేలవైచి
యచ్చముగ యోధమూర్తియే యనఁగ రాణి
ధవళతురగముపైనుండి దారినడ్డె.

అతఁడు రఘుప్రవీరుతుల యౌవననఁ జిక్కనికీర్తిఁ గాంచి త
ద్గతి నెదిరించు కాఁతపయిఁ దారసిలెన్ రఘునాథమేదినీ
పతి, యది కీర్తికిన్ గొదువ పట్టదు, రామవరుండు తాటకన్
సతిగ నెఱింగి చంపె, రఘునాథుఁ డెఱుంగక పోరె నీమెతో.

కాతరమైనదో, యదియొకానొక యొత్తో, మత్తేమొ, రాణి తా
భీతిఁ దొలంగినట్టు పరువెత్తె వెసన్; తమ రెండుసైన్యముల్
చేతులు చేతులుం గలుప శ్రీరఘునాథుఁడు యాచమేంద్రుడున్
బ్రీతి భజించినా రుభయవీచులఁ గూడిన వార్ధులట్టులన్.

ఎటు గనుఁగొన్న సేన లెదురెత్తుట యొత్తుట, రక్తపూరముల్
జొటజొటఁ బాఱు టాఱుట, వసుంధర పంకకళంకయౌట, కం
కట కటకారవమ్ములు, టకాటకి ప్రమోగెడి కత్తిమ్రోఁతలున్,
గుటగుటలాడు ప్రాణులు, కకుప్పుల రేగిన రేణు లయ్యెనిన్.

ఘనజవోత్సాహుఁడై తన సేన కర్ధచం
        ద్రాకృతివ్యూహ మేర్పాటుచేసి
చివగడల్ కైదువుల్ సెలకట్టె సెలఁగోల
        సెలఁగత్తి గల దండు నిలిపి మొనల
దుమ్ములు మేలిదోదుమ్ము లీటెలు విండ్లు
        గల పటాలము ప్రక్కఁ గాపువెట్టి
మరతుపాకులు మహాగురుశతఘ్నులు ప్రయో
        గించు దిట్టల ముందుఁ గీలుకొలిపి
రథగజతురంగబలము సుప్రథితరీతి
వెనుకఁ గాపుంచి రఘునాథవిభుఁడు పోరెఁ
బూర్వపశ్చిమవార్ధు లుప్పొంగి నాఁడు
కలిసినట్టుల నుభయసేనలకు నడుమ.

మడిసెను మాదిసీఁడు, రణమూరణమయ్యెను మాకవీరుఁ, డె
త్తుడిగెను వెంకు, వీరమృతినొందెను శ్రీదళవాయిచెంచుఁ, బె
ల్లడరుచు జగ్గదుం తొలకలై యాచము వైచెను, గాని యాతఁ డ
చెడుగుతలన్ నభోభువనసీమలఁ గందుక కేళి సల్పె వే.

జగ్గవిభుని సేన నుగ్గునుగ్గై పోయె
రాణిభయదఘూర్ణమానయన
వహ్నిగోళయుగళి వఱదఁగట్టె ననూయ
వేగ రామదేవు వెదుక సాగె.

భీతవిభీతగా ననికి వేఱయి పోయిన రాణి తాను ని
ర్భీతిగ యాచమేంద్రు మొగ ద్రేలె భయంకర కాళికాకృతిన్
శ్వేతతురంగమున్ గళను వేయుచుఁ బొంగుచు రంగరాట్కు
జ్యోతిని జిన్నిదీపమును నుఫ్వున నార్పఁ గరాళఖడ్గయై.

రాణివాలకమ్ము రఘునాథరాయందు
చిటికెలోనఁ దెలిసి చేయివీచె,
యాచమప్రభుండు హడలి యేగెడిలోన
రాముదేవవిభుని రాణి డాసె.

కొఱకొఱలాడుచున్ ఛురిక గ్రువ్వఁ గరమ్మును నెత్తు నంతలో
గఱకఱఁ దిర్మలేంద్రరజకాకృతి యొక్కటి యడ్డువచ్చి యా
చిఱుతని గర్భమం దిముడఁ జేరిచి సందిడ కాత్మకంఠమున్
ఛురికకు దానమిచ్చె దయఁజూపుము నీ పగ దీరెఁ దల్లిరో!

అనుచు నవని క్రొఱగి యతి దైన్యబాష్పంబు
రాశితోడఁ జూచె రాణివంక,
'తల్లి' యన్న నుడికిఁ దత్తిరిల్లి యెఱింగెఁ
దానె పెంచి యున్న తల్లి యగుట.

'దేవు డెంత చేటు దెచ్చెనురా బాబు!
నీ' కటన్న జాలివాక్యకుండు
నాఁడు వెడలె నామెనయగారినోటను
మఱచె రామదేవుమాట యపుడు.

'బిడ్డకంఠమందు బెడిదంపుటసి దిగె
నయ్యొ!' యంచు వచ్చి యాచముండు
తిరుమలేంద్రుగళముచ్చురికను లాగెడు
రాణివెన్ను దిగఁ గృపాణిఁ గ్రుమ్మె.

వీపునపోటుతో, వెనుకవీరుని, మోము మలంచి చూచె ర
క్తాపగ నుండి రాణి, కనకాబ్జసమాననముఖానఁ జింతయే
తోఁపదు, కాంతి మాయదు, యథోచితధీరగభీరభావముల్
లోపముగా, విఁకామె తనలోమఱి యేమి తలంచుకొన్నదో.

పకపకా నగి పల్కె "భక్తుఁడా! యాచమా!

నీ భక్తి కలరితి, నెగ్గితీవు,

జయపరాజయములు స్వాయత్తములుకావ?

దైవమ్ముపైనె యాధారపడున?

నాస్తి దేవుండన్న నా వాక్య మిఁక రద్దు,
వైదికార్షమతమ్ము వరలుఁగాక,
ప్రాణమ్ము లిఁక నేను భరియింపలేను, వె
న్ను నఁ గత్తి నీవిఁక నూడలాగు,
లాగుటకుముందు నొకమాఱు రామదేవు
మా కులజ్యోతి నిటు తెమ్ము, మనసుదీర
ముద్దుగొందుఁ, దత్తనువును ముట్టుకొన్న
వెడలు నాపాపములు, రంగవిభుఁడు సైఁచు.

నాఁడె శపియించినాఁడు నన్నతఁడు సుమ్ము
'కలఁడు కలఁడమ్మ! యతఁడు జగద్గురుండు
గెలువలే' వని; సత్యమై వెలసె; నతఁడు
గుప్తభక్తిప్రపూర్ణలోకోత్తరుండు.

సత్యధర్మమ్ము లెచటన్ బ్రశాంతరీతి
సాగిపోవునో యచటనే జయము కద్దు,
యాచమా! గెల్చి తీవు, సత్యమ్ము నీది,
ధర్మమును నీది, నీపాల దైవ మెసఁగు.

తెమ్ము యాచమ! మా రామదేవు నొక్క
మాఱు ముద్దాడి యిత్తుఁజుమా, యటంచు
సారెఁ బ్రార్థించి తా మనసార వానిఁ
దీసికొని ముద్దుగొంచునె వాసె నుసురు.

నిరుపమునిజాడ నెవరికిఁ దెలియఁ, నతఁడు
చివరిపల్కుఁగూడ నెవరికిఁ జెప్పలేదు,
అంతె 'పరితాపదగ్ధహృదంతరుండు
అవని కుపకారి తనకు మహోపకారి.'

తల్లి! యెంత పవిత్ర వుదాత్తవమ్మ!
రాజసీయపథమ్ము వేఱగుత నీకు
నాకు; ప్రేలు నంపించుకొన్నావు గాని
శీలమంచున నభిమానశీలమంచు.

యనెడు నుడులు యాచమునోట నవతరిలిన,
నతనిచేతులు బిడ్డను నామెనుండి
తీసినవి, రఘునాథపృథ్వీశ్వరుండు
జయజయధ్వానములకు నాజ్ఞల నొసంగె.

వేదగానధ్వనుల్ విశ్వజననీకంఠ
మంగళాశీస్సులై పొంగువాఱ
కవుల యమోఘవాక్యములకు వశపడి
కలుములు వరదలు గట్టుచుండ
బాంధవహితకోటిబంగారుదీవనల్
గుబగుబ జల్లులై గురియుచుండ
వృద్ధపుణ్యాంగనావితతియాశీస్తుతుల్
లలితవాద్యధ్వనుల్ చెలఁగుచుండ

మంగళస్నానమంద్లై వస్త్రమాల్యాదులకట
సముచితాలంకృతిశ్రీప్రసన్నుఁ డగుచు
రామదేవప్రభుండు చంద్రగిరిదుర్గ
రత్నసింహాసనమ్ము నలంకరించె.

తిరుపతికొండపై నెసువతిప్పలోలంబున విలసిల్లు వేంకటే
శ్వరుగుడిగంట చంద్రగిరిపై హవణిల్లెడు రామదేవు ఘం
గరుడయ్యఘంట నొక్కపరి ఖండనమొనరించు చుండునంట యా
సిరి రఘునాథయాచమవిశిష్టబహూకృతియంట జేసికిన్.

శ్రీకర ! విలసద్గుణార
త్నాకర !మద్రాలపాటనాన్వయజలధి
ప్రాకటసుధాకరా ! ర
మ్యాకారా ! రామకృష్ణమహితశుభకరా !

నీకై నా కవితాలతాంగి తమి పూనెన్, నీ పదశ్రీకిఁ బూ
రేకై స్వాదునవోర్ఘ్యపూజనము చేర్చెన్, నీ యశశ్శ్రీకి నా
జూకుల్ తెచ్చెను విశ్వమోహనకళాశుద్ధాంతమందుండి, నీ
కాకల్పాంతము దైవసత్కృపను లభ్యమ్మౌత సత్సంపదల్.

ఇ ది న వ మ ఖ ం డ ము

స ం పూ ర్ణ ము.

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 16 | భావతెంపజీ | భావము తెంపజీ |
| 15 | 13 | విశ్వజననీ | విశ్వజనని |
| 21 | 10 | కుక్షీగ్ణవకున్ | కుక్షిగ్ణఘనునకున్ |
| 22 | 4 | నృపతిశేఖరా! | నృపతివరేణ్యా ! |
| 22 | 10 | స్రివింతికల్ | స్రవంతికల్ |
| 23 | 15 | యాయిరై | యాయియయి |
| 43 | 16 | లాదవంగదనకర్జమ్ము | లావవంగగర్జమ్ము |
| 44 | 17 | ఈజన్మకు | ఈజన్మమునకు |
| 47 | 15 | సప్త | సప్తసం |
| 48 | 9 | దక్షిణశా | దక్షిణదిశా |
| 54 | 17 | తుదియ్యె | తుదియయ్యె |
| 58 | 1 | లాస్మమ్మాడిరో | లాస్యమ్మాడిరో |
| 60 | 10 | కాంక్షాదీక్ష్ణో | కాంక్షాతీక్ష్ణో |
| 62 | 19 | తప్రాబల్య | తత్ప్రాబల్య |
| 88 | 15-16 | మఱచియుండరుగదా | మఱపుగొనరుగాదొ |
| 101 | 11 | చేరిన | బేరిన |
| 102 | 18 | జగ్గరాజుపలుకులు | యతనినుడులు |
| 106 | 2 | నృపకలీనుడు | నృపకులీనుడు |
| 110 | 1 | పనవిని | పనివిని |
| 113 | 16 | ముద్దాల రామకృష్ణ మధుమూర్తి! | ముద్దాల కులరామ కృష్ణము మూర్తి! |
| 122 | 17 | ఈనురదృష్టు | ఈదురదృష్టు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 133 | 13 | నిన్ సహాయోద్ఘ | నిన్ను నా సహాయోద్ధ |
| 134 | 16 | జూర్ణమయ్యో | జూర్ణమ్ముయ్యో |
| 136 | 7 | యెచ్చోనిల్చె | నెచ్చోఁబ్రదాఁగె |
| 139 | 7 | సంతరణ | నిస్తరణ |
| 141 | 8 | మున్త్రందు | మున్ముందు |
| 145 | 15 | జాటుదో | జాటినఁ |
| 145 | 19 | నొత్తువో | నెత్తుదో |
| 163 | 7 | యమాయిక | యమాయికముగు |
| 163 | 8 | యామెసేనగ | యామెజనముగ |
| 172 | 4 | మహోప కారి | మహోప కారి |
| 172 | 13 | జననీకంత | జననికంత |
| 173 | 17 | నవమఖంము | నవమఖండము |
| 65 | 4 | మధురతరంగా! | యమృతతరంగా |
| 3 | 2 | పవిత్రితమ్మయిన | పవిత్రితమ్మయిన |

పాఠకమహాశయులకు మనవి:— ఈకావ్యము వారము రోజులలో ముద్రింపఁబడినది. సాక్షీవ్రాయని చిత్తుప్రతి మాత్రమే యచ్చున కీయఁబడినది. రేబవళ్లు ప్రూఫులు నేనొక్కఁడనే సరిదిద్దుకొన వలసివచ్చినది. క్రిందుమీఁదు కొట్టివేఁతలుండుటచేత దృష్టికిఁ దప్పిజాఱిపోయినట్టి కొన్ని పొరపాటులకుఁ దప్పొప్పులపట్టిక వేయుక తప్పినదికాదు.

పై పట్టికననుసరించి సరిదిద్దుకొనఁ బాఠకమహాశయులకు నా ప్రార్థనము.



కృతికర్త.